

శ్రీరస్తు

శుభమస్తు. అవిఘ్నమస్తు

# శ్రీ మదనగోపాలశతకము.




కృష్ణ కేశవ చిన్మయానందము
కుందగోవింద వైకుంఠ వాసుదేవ
నారాయణ దేవ దేవ యనంత
నరసింహ వామన గరుడగమన
క్షీరాబ్ధిశయన లక్ష్మీనాథ పుండరీకాక్ష హృషీకేశ యాత్మ
రూప, మధుసూదన త్రివిక్రమ జనార్దన పురాణపురుష
కౌస్తుభమణి భూషితాంగ
శంఖచక్రగదాఖడ్గ సహితహస్త
పాహిమాం దేవయని మిముఁ బ్రస్తుతింతు
భూరిమయవాస కోలంకపురనివాస
మదనగోపాల రాధికా హృదయలోల.

సీ. గుణతరగౌతమ గోత్రపవిత్రుండ పరిశీలవంకాయలపాటి
కులుఁడ, వెంకయమంత్రి సాధ్వీమణి కామమాంబాగర్భ
వార్ధిజైవాతృకుండ, గుండు వెంకటరామ కోవిదగురుదత్త

శుద్ధపంచాక్షరీసిద్ధి యుతుండ, సకలలక్షణలక్ష్య సాహితీని
పుణుండ శైవవైష్ణవసదాచార రతుండ
వెంకటాఖ్యుండ నే జగద్విదితముగను
శతకమొనగూర్చి త్వత్సమర్పితముగాఁగ ॥భూ.

సీ. దండంబు దోర్దండ మండితకోదండ దండంబు భూరిప్రతా
పచండ. దండంబు పాలితార్తస్తుత్యవేదండ దండంబు ముని
వరదానశౌండ, దండంబు దండితాగతనిశాచరకాండ దం
డంబు వైరిరౌద్రప్రకాండ, దండంబు భక్తసంత్రాణ మ
హోద్దండ దండంబు బ్రహ్మాండధరప్రచండ
దండమో పాపతిమిగ మార్తాండ నీకు
యనుచు మ్రొక్కెదనను బ్రోవు మద్యవేగ ॥భూ.

సీ. శరణు జగత్కర్త శరణు జగద్భర్త శరణు జగద్ధర్త శరణు
శరణు, శరణు తాండవలీల శరణు పాండవపాల శరణు పండిత
ఖేల శరణు శరణు, శరణు శంకరపక్ష శరణు కింకరరక్ష శరణు
పంకరుహాక్ష శరణు శరణు, శరణు దయాసార శరణు జయా
ధార శరణు నయాగార శరణు శరణు
శరణు వారణ వారణ శరణు శరణు
శరణు కారణ కారణ శరణు శరణు ॥భూ.

సీ. వీరాయ గోపికాజారాయ రుక్మిణీదారాయ భవభయోత్తా
రణాయ, శూరాయ మునిజనాధారాయ కరుణాప్రచా
రాయ సత్యప్రచారణాయ, ధీరాయ వార్ధిగంభీరాయ సద్గు
ణవారాయ దురితనివారణాయ, స్ఫారాయ ధృతజగద్భా
రాయ నవసుకుమారాయ కృతశత్రుమారణాయ
తేనమో యనుచు విను తించు ధీరమతులు

సిద్ధసామ్రాజ్య లక్ష్మిచేఁ జెలఁగుచుండు ॥భూ.

సీ. మురిసిడితుప్పలకు గొప్పాలుదివ్వనేటికి వట్టిమూతికి మొరల్
గట్టనేల, గొడ్డుటోతుకునొత్తి కొట్టుకాయంబేల మాసిక
మ్మకు పైటమాటదేల, అంధురాలికి నిలువుటద్దమేటికి నవ్వుం
బకునకొయ్యా రంపుచానయేల, దొంగముండకు వ్రతో
ద్యోగనిష్ఠలవేల జారకాంతకు సదాచారమేల
క్షుద్రగుణునకు సజ్జనగోష్ఠియేల
మోటకొయ్యకు మృదువైనమాటలేల ॥భూ

సీ. దురితాత్మునకు దేవ గురుపూజనంబేల కర్ణహీనులకు చౌక
టులవేల, వ్యాగరోగకృశునకు వారిచందనంబేల పరమలో
భికి దానపటిమయేల, కర్మబాహ్యునకు గంగాస్నానమేటికి
కామాంధునకు తపఃకాంక్షయేల, తిండిపోతుకు నిత్య దేవ
తార్చనలేల వెఱ్ఱివానికి సద్వివేకమేల
మూర్ఖజనునకు సతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల ॥భూ.

సీ. కుళ్లుతొత్తుకు గంధ కుసుమాగరులవేల గూదలంజకు జకి
కోకలేల, మొండికట్టెకు ధర్మములుదెల్పఁగానేల సొట్టవా
నికి నాట్యశోభలేల, అంధురాలికి నయ నాంతపొంజులవేల
బోసిదానికిని తాంబూలమేల, పలుగుదండకు పరి భక్తి
మార్గంబేల చెడాగుముండకు నీతిజెప్పనేల
మూర్ఖజనునకు బహుతరామోదకారి
సరసకవితావిచిత్ర వైఖరులవేల ॥భూ.

సీ. గుడిగూల్చి యిటుకలకొట్టుగట్టిన వాఁడు చెట్టుకొట్టుటకు
విక్షేపపడునె, తిన్నయింటికిఘాత పన్నఁజూచిన క్రూరుఁడ

న్యాపకృతికి భీతాత్ముఁడగునె, చెలులచుట్టంబుల చెఱిచిన
పాపాత్ముఁడొరుల మాపగ చింతనొందఁగలఁడె, తనవారల
జగీడు దలఁచిననిర్దయుండి తరథార్థము సంశయించఁగలఁడె
తల్లిదండ్రులహింసించు దారుణుండు
దుఃఖపడగలఁడే గురుద్రోహమునకు ॥భూ.

సీ. తల్లిచెవుల్ దెంచ దలఁచిన మూర్ఖుండు బినతల్లిచెవి దెంచ
భీతిపడునె, తండ్రినిపస్తుంచి తానన్న దుర్మతి యాఁకొన్నయ
తిథుల కన్నమిడునె, తమ్ములపాలి విత్తము మ్రింగుఖలుం
డు పరధనంబుల కానపడకయున్నె, తనయులపట్ల మాత్స
ర్యమూను దురాత్ముఁడన్య వైరమునోపమని తలఁచునె
నమ్మువారిని జెరుచు దుర్ణయపరుండు
యితరులను బాగుజేయ నూహించగలఁడె ॥భూ.

సీ. పైత్యకంబున రాత్రి భక్షించు చపలుండు యుపవాసములు
నిష్ఠనుండగలఁడె, యిలు వెడలంగ తానలయుమాలుగుఁజోతు
తీర్థయాత్రికేఁగదిరుగఁగలఁడె, గ్రహణకాలమున మున్గని
మూఁడుడనికంటు వేడ్క పాత్రసన్నాన విధికిఁజనునె, బాపడి
కొకసన్వయంపాక మివ్వనిలోభి నిత్యాన్నదానంబు నిలుపఁ
• తనదుపెండ్లామునటిమి దీర్పనిజడుండు (గలఁడె
దివిరిమరచంద్రఁ గోడండ్రఁదీర్పగలఁడె ॥భూ.

సీ. పిడికెడుభిక్షంబు బెట్టజాలని దాత యిష్టార్థసంసిద్ధులివ్వ
గలఁడె. చేనిగట్టుదాటలేని గుల్లుముష్టి గిరి దుర్గములను లం
ఘించగలఁడె, యూరఁబంతిభీతి నొందిపారిన బంటు వాడి
బొబ్బలుల పోటాడఁగలఁడె, కొలుచునారికి జీతములొసం
గనిఘోర యర్థులబిలిచి వెయ్యారులిడునె

బట్టబాగడనినొక పూటబత్తెమిడని
యతినికృష్టుఁడుసత్కృతులంగఁగలఁడె ॥భూ.

సీ. అప్పిచ్చియిమ్మనియడుగునాతఁడధర్ముఁడెగదొబ్బు నాతఁడు
తగవుపెద్ద, అడ్డుండి తప్పించు మనువాఁడుకఠినుండు తం
టాలుబెట్టునాతండుసాధు, వెరువిచ్చియడిగిన నరుఁడుదు
రాత్ముఁడు సమ్ముతిన్న వాఁడార్యవరుఁడు, దాచయిచ్చిన
సొమ్ము దలఁచువాఁడవివేకి లేదుపొమ్మనువాఁడువేదవేత్త
యనుచుతీర్పులు చేసినయట్టిమూఢు
లంతకన్నను గుణవంతులవనిలోన ॥భూ.

సీ. తనదుదరిద్రత్వమునకు నేడ్వఁగనేల యితరసంపద తాస
హించలేక, తనయాలు రంభయైనఁ గృశింపఁగనేల తా
నన్యసతి పొందుమాన లేక, తనదుశత్రులసాధ్యులని చింత
పడనేల యొరులమాపంగఁ దానుడుగలేక, తనపుత్రులవ
గుణులని మొత్తుకోనేల యొకరిబిడ్డలనీతి కోర్వలేక
యెఱుగనేరని మూఢులకేమిజెప్ప
దీనికిఫలంబు మీఁదనుగానవచ్చు ॥భూ.

సీ. తనతాతనిరతాన్నదాతయంచననేలమునలామెయాళ్ళంటి
ముష్టియెత్త, తనతండ్రిగారు సద్వ్రత నిష్ఠుఁడననేల తల్లి
బల్ జారవర్తనలుసేయ, తనదుభార్యను వరగుణవతియననేల
కూతురుతలవంపు రీతిఁగువ, తనవారలంత సద్ధర్మాత్ముల
ననేల చెల్లెల్లచౌర్యముల్ సేయుచున్న
తానుతీర్పరినని యభిమానమేల
కొడుకుయొకమూలఁ దెరవాట్లుగొట్టుచున్న ॥భూ.

సీ. అప్పుబుచ్చుకొనిలేదను మొండికొయ్యకుపత్రంబుచించుకో

భావమగునె. గురుజనద్రవ్యా పహారణశీలున కన్యధనము
హరింప సంతాపమగునె, తల్లిదండ్రులను బాధల బెట్టుక్రూర
చిత్తునకు బాంధవపీడ దోషమగునె, పాలించుప్రభువు కపా
యమెంచు దురాత్మునకు మిత్రఘాతయన్యాయ మగునె
తనయుపత్నిని రమియించు దారుణునకు
పరసతీసంగమాసక్తిపాపమగునె ॥భూ.

సీ. పుత్రికకే నల్లుబూనగ బెట్టనిమామగారల్లునకు రత్నహార
మిడునె, పెనిమిటికే కూడుబెట్టనియిల్లాలు శ్రితబంధులకు
విందుసేయగలదె, తనతల్లిపట్ల నెత్తిన మూర్ఖుడింతల్లి సూ
జ్ఞాప్తి మల్లగలడె, తమ్మునకే కీడు తలచెడి పాపాత్ము
డొకరి బాగుకు చింత యుంచగలడె
యిట్టిదుర్మార్గవర్తుల కెవరుచెప్ప
గలరుయమరాజు గొకడుదక్క జగతి ॥భూ.

సీ. తల్లినివేరుంచితమ్ములవిడదోలి అక్కచెల్లిళ్ల సొమ్ముపహ
రించి, బంధువులనుతృణ ప్రాయంబుగా నెంచి యొరులమా
పగ మదినూహజేసి, తనకన్నదెలిసిన జనుడెవ్వడనిక్రొ
వ్వి యించుకంతయు ధర్మమెఱుగకుండి, లోపలబహువిధ
రాలోచనంబులు జేసి పైకినీతులు పెక్కుబలుకుచుండి
బుధులకొకకీడు సేయంగబూనజూచు
నిట్టిపురుషాధముని జన్మమెందుకొఱకు భూ.

సీ. పరజనద్రవ్యా పహారణమ్మొక్కటి అన్యసతీసంగమాప్తి
యొకటి, పితృమాతృసద్భక్తి విముఖమ్మొక్కటి సూత్రి
తజన పరిత్యాగమొకటి, సాధుసజ్జనబంధు జనదూష్యమొ
క్కటి స్వామినిందాపర భావమొకటి, వివిధపండిత వర్గ

విద్వేషమొక్కటి మిత్రభూతృత్వ ప్రమేయమొకటి
యిన్నియునుగల్గి వర్తింపుచున్నవారు
కోయ్యలకోకళ్లు తీర్పులు చెయ్యగలరె ॥భూ.

సీ. తనవారు తలవంపు పనులు జేయ సహించు పరులు జేసిన తప్పు
పట్టఁజూచు, తనయింటిలోకాని పనికమ్మకోఁజూచు పొరి
గింటివని రవ్వపరుపఁదలఁచు, తనపుత్రి జారవర్తన మాటు
పడఁజేయు పరుల బిడ్డలరంకు బయలఁబెట్టు, తనకు చెల్లెలి
దొంగ తనములో నసడంచు లాఁతివారైన హేళన మొనర్చు
యిట్టిదుర్మార్గులకు యమపట్టణమున
దీనికిఫలంబు తథ్యమైగానవచ్చు ॥భూ.

సీ. వ్యాఘ్రంబు లేళ్లజంపక మళ్లిపోవునె పిల్లిమానునె కోడిపిల్లఁ
బట్ట, తోఁడేలు మేఁకలదును మాడకుండునె పెనుఁబాము గప్ప
లదినకయున్నె, కొంగ చాపలను గళుక్కున మింగకుండునె
డేఁగ గువ్వలను పీడింపకున్నె, దుంతగుబ్బములను దౌడఁకొట్ట
కయున్నె కాకిగోరలఁదన్ని కరువకున్నె
ఖలుఁడు సజ్జనులకుఁ గీడుదలఁపకున్నె
కుడదనియెందఅన్న నీక్షోణియందు ॥భూ.

సీ. బాలుడంచును పోట్లపసరంబు విసులునె గుడ్డివాఁడని కాట్ల
కుక్కజనునె, చూలింతరాలని తేలుమన్నించునె మునలిగో
వని కాకి ముక్కు విడునె, ఫలవృక్షమని గదల్పక పోవునే
గాడ్పు భూసురుండని పులి ప్రాజలిడునె, పలుకుచిల్కని పిల్లి
దలఁచి యూరకయున్నె యీనుచేసని మల్లి మెడ్డ జనునె
ప్రజల బాధించు దుష్టవర్తనుఁడొకండు
సుజనులకుఁగీడు సేయంగఁజూడకున్నె భూ.

తగోయనమాన్య న్నమభ మడ్డగఁ బిల్లిమొగిరినట్లు, కాలసర్ప
మున్ప్రింగకప్పచూచినరీతి దీపమార్పఁగఝూఁగదిరుగుభాతి
ధరణి నధమాధముం డొక్క నరుఁడు గొప్ప
గొప్పవారలతో నెదురొక్కనఁదలంచు భూ.

సీ. ధర్మంబుపీసమంతయుఁదల్పఁగానాస్తి దానమన్నదికలలోన
నున్న. అర్థిపాలనము రవంతఁ గానగవట్టి సత్యవాక్యంబు లేశం
బులేమి కారుణ్యభావంబుగోరంతయును కల్గ శమదమాసక్తి
కొంచెముపాళక్కు, స్నానసంధ్యాద్య నుష్ఠానకర్మంబుల్లనై
వనైష్ణవభక్తి తోఁబ్రసజబ్బు
యిట్టిమూఢులఁబుట్టించినట్టి బ్రహ్మ
ననఁగవలెగాక పిండ్రిఁడిట్టనుఁబసేమి భూ.

సీ. అన్యాపకృతివాని కాధారభూతంబు దుర్బుద్ధివానికిఁదోఁ
డుపీడ, దారుణత్వమువాని తలపైకిరీటంబు పరదూషణము
వానిపంటచేను, అన్యాయవృత్తిఁ పీడభ్యసించినవిద్య బం
ధువైరము వానిపట్టుకొమ్మ, పాపహింసాకర్మ వానినిత్య
జపంబు పాపశీలము వాని పాలిసొమ్ము
యనుచులోకులు తన్నాడుకొనుచునుండ
బ్రతుకుమనుజునికన్న గార్దభము మేలు, భూ.

సీ. మహితోపకార ధర్మము వహించడుగాని యసహాయశూ
రుఁడన్యాపకృతికి, సముచితస్మృతిశాస్త్ర చర్చ సేయఁడుగా
ని మహార్షవాదములకు మొనటిచెయ్యి, పుణ్యకార్యారంభ
బుద్ధిగాంచఁడుగాని పాపకర్మకు మతిస్థాపకుండు, పరలోక
చింతఁదప్పఁడుగాని ప్రాణిహింసాకర్మయందు నిష్ఠాగరిష్ఠుఁ
డనుచుభూజనులెల్ల దన్నాడుకొనఁగ

లఁబాధించఁ బొల్పొందెడువాఁడు, తమ్ములఁజెఱుప యత్నము
దలంచెడువాఁడు బుధులతో వైరంబుఁ బూనువాఁడు, పదు
గురుకాదన్న పనులుజేసెటివాఁడు పరధనంబుల కాసపడెడు
సుకవిజనములతోఁ బోరఁజూచువాఁడు (వాఁడు
దుర్గతినిజెందు నిహపరదూరుఁడగుచు భూ.

సీ. పరువుప్రాజ్ఞజను పౌరుషమణగారు కులముగోదావరి కూల
జరుగు, మహిమమర్యాదలు మంటలోఁగలియును చదువులు
సంధ్యలుచట్టువారు, ప్రజ్ఞలుబుద్ధులు పరలోక మేగును గొ
ప్పలుకీర్తులుతుప్పలెక్కు, ధర్మమార్గమునీతి నిర్మూలమై
యుండు సకలప్రతిష్ఠలుసన్నగిల్లు
వంశమందునసేక పాపవర్తనుండు
బుట్టుటనుజేసిబుధులకీ భూమియందు భూ.

సీ. గడియలోపల పెక్కు కల్లలాడఁగవచ్చు నాడినమాట లేద
నఁగవచ్చు, అప్పులుయెగదొబ్బి చెప్పకొమ్మనవచ్చు చుట్ట
లచుల్కఁగాజూడవచ్చు, తనవారనకబాధలఁ బెట్టగావచ్చు
మిత్రఘాతుకవృత్తి మెలఁగవచ్చు, యొరులకొంపలు మా
పనూహాసేయఁగవచ్చు తనయులనైన బోఁదరమవచ్చు
గాని యమలోక బాధయొక్కటియుఁగడువ
కఠినచిత్తులకది చేత గాదుసుమ్ము భూ.

సీ. వ్రాసినవ్రాఁతఁదా వ్రాయలేదనవచ్చు తప్పుజేసుకులోన
దాచవచ్చు, నీతిఁదెల్పఁగబోతె బూతులాడఁగవచ్చు పెద్ద
లుకాదన్న బెనఁగవచ్చు, యింటికేగినవారి నెదిరికొట్టఁగవ
చ్చు కానికూటికి వడిగట్టవచ్చు, పలుగుకొయ్యలమాట
పాటిసేయఁగవచ్చు బుధులవాక్యము త్రోసిపుచ్చవచ్చు

యనేల, ప్రజలఁబీడించి ధర్మము సేయఁగానేల దాష్టగొట్టి
సువర్ణదానమేల, మాన్యముల్ కబళించి మఖము సేయఁగ
నేల సాధులఁజెరిపి పైశాంతులేల, బంధులసొమ్ముహరించి
భూరియివ్వఁగనేల పురములుగూల్చి గోపురములేల
యిందుకుఫలంబు దేహాంతమందెతప్పు
నెఱుకబడుగాక కూళలకేల చెప్ప భ.

సీ. బురదగోతులలోన బొరలాడునంతకు సారచందనగంధచ
ర్చయేల, పరగళ్ల వెంబడి దిరుగుగాడిదికి విశాలమందిర ని
వాసంబులేల, బయలుపుల్లెలునాకి బ్రతికెడుకుక్కకు స
రసాన్న భక్ష్య భక్షణములేల, యడవుల చెట్లెక్కి యాడుకో
తికిరత్న సౌధాగ్రసీమ సంచారమేల
మూర్ఖజనునకు సతతప్రమోదకరణ
సాధుసజ్జనగోష్ఠి ప్రసంగమేల భ.

సీ. పదుగురుమెచ్చి శాబాసనన్నదిమాట నడిమృగంబుల జి
క్కునడిచినదిమాట, వ్యాఘ్రసింహముల నాక్రమించునదివే
ట నాఖ్యఫలోత్కృష్టమైనతోట, నిండుగాబహుజనులుం
డునదే పేట యిల్లాలుగల్గుట యింటితేట, పరులచే సాధింప
బడకయున్నదికోట పదివందినడచుచున్నదియబాట
విన్నవారికి హృద్యమైయున్నపాట
కన్నవారికి జితప్రమైయున్ననాట భ.

సీ. కలిమెంతగలిగిన దొలఁగవాపత్తులు తమరెన్నివిధములఁదఁ
న్నుకొన్న, తపమెంతగలిగిన తప్పదుకర్మంబు తోఁచకతమ
రెంత దుఃఖపడిన, చదువెంతగలిగిన వదలదుదారిద్ర్యమూ
రకె తమరెన్నియుక్తులుజనిన, బలమెంతగలిగిన భాగ్యమువ్యా

సీ. రణభీరువునకు దారుణభయ్యంకైతోఁచు పరిబలసంగ్రామవ్రి
వర్తనుండు, ననృతభాషికి నసహ్యాలాపుఁడై యుండు ఘనత
రసత్యవాక్యవ్రతుండు, జడమానసునకు సేరి బడిగాయవ
లెనుండు సరసవాక్సూక్తి ప్రసంగశాలి, పాపకారికిదుష్ట భావ
నుఁడైదగు పుణ్యకార్యారంభ బుద్ధిచరితుఁడ
హాహాయీయుగధర్మంబు లరయదరమె
యిట్టిమతులై సుజనులనెన్నుచుందురి భూ.

సీ. చందనగంధంబు చర్చసేయుటదోడ్డ బురదదాల్పదె దున్న
పోతుమేన, బంగరుతగటిదుప్పటి గప్పగోప్పానె గంగిరెద్దు
కు లేదె రంగుబొంత, రమణీయ రత్నహారముఁదాల్పరెయొకనీ
చవేసగానికి వెవింత పేస్లు, ఘనతరంబగుసొమ్ము గణియిం
చవ్రితిభానె వారకాంతకు లేదె భూరిధనము
వైభవంబునకివిగావు వరుసలరయ
అమితదానయశః ప్రతాపములుగాని భూ.

సీ. కన్నబిడ్డలఁజాపగణగఁజూచినయది తల్లిగాదొకవిషవల్లిగా
ని, తలిదండ్రులకుహానిఁ గలుగజేసినవాఁడు కొడుకుగాఁడొక
పెద్దపడుకుగాని, తనయులనందఁ దరమికొట్టెడువాఁడు
తాతగాఁడొక యమదూతగాని, తమ్ములఁజెరుప యత్నముఁ
జేసెటివాఁడు యన్నగాఁడొక మోఁదున్నగాని
తినదుదాయాదులను బోరివదలఁవజేని
నరుఁడుగాఁడతఁడు వానరుఁడుగాని భూ.

సీ. కాయంబుమృదుగతి కంకణియొరుగునే పుష్పవాసనచీడ పు
ర్వుగనునె, పాయసరుచితెడ్డు బద్ద గ్రహించునె తేనతీపినిని
గ్ధ తెలియఁగలఁడె, నానుఁదనగంధ సౌరభ్య మెఱుగు

నూత్రింబువమౌక్తిక శుద్ధిగన్నునె, జలము మాహాత్మ్యంబు
దెలియచేర్చునెకప్ప అడవియోషధి సత్యమరయగలదె
తులువమానిసి పెద్దలగలిసియున్న
గాని వారిగుణంబులు గాంచగలఁడె భూ.

సీ. ఎలుకలఁజంపి పిల్లులకుఁ బెట్టించి గువ్వలమనుమాడి సాళ్వ
ములకొసఁగి, కప్పలబట్టి సీర్కట్టెలకొప్పించి లేళ్లఖండిం
చి తోఁడేళ్లకిచ్చిఁ, బలుదువ్వలనుదురించి పులులముందటఁ
బెట్టి బక్కల నక్కలపాలుచేసి, ఫలవృక్షవనము కట్టెల
క్రిందజారిచ్చి పొట్టచేలోక్కసి యాఁబోతు మేపి
నట్టితమవంటి ధర్మాత్ములవనిలోన
గలరెయని మోటకొయ్యలుఁ బలుకుచుండ్రు భూ.

సీ. గదుపిశాచముఁరీతి నెడపక భక్షించి గాడ్దెసూకరములఁ గ
డుపెంచి, గాడిదెచికిలించు గతిఁనవ్విళించి గొప్పనూఁ
బోతులాగున మదించి, ముదికోఁతిలాగున మొకముబిగా
యించి వరఁడుపోలికె యిక్కవలుగపంచి, దున్నచొప్పున
పెద్దపిన్నలఁ దొలగించి తలపుచ్చుశునకంబు గతిచరించి
మించితాఁబెద్దసంచు గర్వించియున్న
హీనునకు గీర్తిగల్గునా యెంచిచూడ భూ.

సీ. కౌటిల్యమెక్కువ కార్పణ్యమధికంబు మాత్సర్యమురవు
దుర్మదము తరుచు, కోపంబుగాటంబు కూరత్వము ఘ
నంబు గర్వంబులావు ముష్కరతదొడ్డ, దారుణత్వము
పెల్లు దాక్షిణ్యమతిగొప్ప జారత్వమెచ్చు దౌష్ట్యంబు పెక్కు
చాంచల్యగుణము విస్తారంబు చాపల్యమతిమాత్ర మన్యా
యగతిసమృద్ధి

గలిగివర్తించు పాపచిత్తులువాసించి
మెగ్గులెన్నుదు రార్యులసిగ్గుమాని భూ.

సీ. ననములస్తుత్య వంశమునకు దౌర్జన్యకారి హీనుని బెద్దగాన
మర్చ్చి, సంతతసాధు నిశ్చలపుణ్యవర్తికిఁ బలుగుగ స్యూలిని
ఘాన్యఁగూర్చి, బహుధర్మకీర్తి తత్పరునకు దుర్జయాకరుమూ
ర్ఖుఁ దనయునిగానొనర్చి, సగనసౌందర్య లక్షణకళావతికి
ముష్కరకురూపుని భర్తగాఁగుదిర్చి
అబ్జభవుఁడు తదీయపూజ్యత్వమెల్లఁ
బనికిరానియ్యడది యేమిపాపమొక్కొ భూ.

సీ. కొండంతవిత్తంబుఁ గూడఁబెట్టిననేమి దానహీనుండైన
మానవుండు, నిఖిలవిద్యాభ్యాసనిపుణుఁడైననునేమియమిత
దుర్గర్వాంధుఁడైనమనుజుఁ, డుకులతరసంపత్తుఁ గాదవియుండిన
నేమిదీనరక్షాశూన్యుఁడైనజనుఁడు, బహుకాలమాయువుఁ బ
డసియుండిననేమి యపకీర్తిభాజనుండైననరుఁడు
యిట్టివారల గొప్పలనెన్నుచున్న
పురుషునవివేక మెంతనిఁబొగడవచ్చు భూ.

సీ. చతురంగబల సముద్ధతినిఁగాంచిననేమి యాసన్నరక్ష సేయని
నికృష్టుఁ, డిద్ధరాతలమంతి నేలుచుండిననేమి బుధులఁబోషిం
చని మూర్ఖచిత్తుఁ, డన్యదేశంబుల నాక్రమించిననేమి ప్రి
జకూర్తిఁ బాపిఁ బ్రోవనిఖలుండు, బిరుదుటెక్కెంబులు పె
ట్టుకొనిననేమి శరణాగతులను బెంచనిదురాత్ముఁ
డిట్టివారల సౌభాగ్యమెందుకొఱకు
వీరిఁగొనియాడఁ బోదవసార్వరిగాని భూ.

సీ. ప్రభువాజ్ఞఁ గొలఁదియే ప్రజలమర్యాదలు పటిశిక్షఁ గొలఁది

యే నతిగుణమ్ము, భాగ్యంబుకొలఁదియే బంధుసన్మానంబు
తిండికొలందియే దేహపుష్టి, మాతతీర్పుకొలంది కూతురున
డవళ్లు నేలమంచికొలంది చేలపంట, గురుబోధనాప్రౌఢికొ
లఁది శిష్యుల తెలివి తండ్రిప్రీతికొలంది తనయుప్రవృత్తి
గానియెక్కువ తృణమంత గలుఁగఁబోదు
తోఁచకూఁరకె చింతించిదుఃఖపడిన భూ.

సీ. తిండిపోతుకుఁగూటి కుండయందునెభ్రాంతి దురితాత్మునకు
గురుద్రోహచింత, కామాతురునకన్య కాంతారతాసక్తి
పలుగుకొయ్యకుఁ గానిపనులతలఁపు, పాపకారికిసజ్జనాపకా
రవిచార మతిహీనగుణికి నీచానురక్తి, క్రూరచిత్తునకు స
ద్గోష్ఠిజనద్వేష మతిధనాకాంక్షికన్యాయబుద్ధి
బాయువెప్పుఁడు వారలపాలికర్మ
మెట్టిదియొకాని యెఱుఁగరాదెవరికైన భూ.

సీ. మున్బుద్ధిబలువైనఁ దొలఁగునుసంపత్తి శ్రవణవ్యమొదవినఁగీ
ర్తి మళ్లు, నన్యాయమెచ్చిన నధికారమూఁడును మదముదట్టి
నఁజను మార్దవంబు, జారత్వమెచ్చిన సన్నగిల్లుపవిత్రత్వ కు
టిలత్వమురువైన గొప్పచెడును, గర్వంబుతరుచైన గౌరవం
బుఁదొలంగు దరిద్ర్యాసపైనైన ధర్మముడుగు
యివియెఱుంగక వర్తించుహీనజనులు
పనికిరాకుందురు గడ్డిపరకకైన భూ,

సీ. ప్రభువుదుర్ణయుఁడైన ప్రజలుజేసినకర్మ పతివిరక్తుండైన
భార్యకర్మ, అధ్యాపకుఁడు లోభియైన సద్బులకర్మ కరణము
చెడ్డగైన కాపుకర్మ, తండ్రికుష్ఠుఁడైన తనయువర్గము

కర్మ తల్లినిర్దయురాలైన పిల్లకర్మ, క్షితిచిక్కఁజేరినచేని
యాతనికర్మ కుటిలుఁడైనసరుండు కులముకర్మ
గానివారలదుష్కర్మ గామతలఁప
మొఱఁగనేరక వారి నొగ్గెన్నరాదు భూ.

సీ. కవిజనంబుల కుపద్రవముఁ దల్పుటముప్పు బలవంతుతో
వైరపడుటముప్పు, దేశాధిపతిని నిందించఁ బూనుటముప్పు
గ్రామాధికారితోఁ గక్షముప్పు, చెడి చుట్టమింటికిఁ జేరఁబోవు
టముప్పు చెడుగులతోఁ బొందు చేతముప్పు, భార్యకుఁ జనువి
చ్చి పాటిసేయుటముప్పు వదినుంతికాదన్న పనులుముప్పు
మొండికొయ్యలమాట నమ్మకొనిబుధులు
పాముకంటాల పనికడ్డపడుటముప్పు భూ.

సీ. పరమమూర్ఖుండైన సరసాగ్రగణ్యుండు శుద్ధజనుండైన
బుద్ధిశాలి, వంకరకులుఁడైన సంపూజనార్హుండు యవివేకి
యైన పరిజ్ఞానవితుండు, గడుపందయైన పరాక్రమశౌర్యధు
ర్యుండు మలభక్షకుండైన మాన్యగుణుఁడు, పరుషభాష
ణుఁడైన బహువాక్యచతురుండు ధర్మశూన్యుండైన తగవు
యనుచు బొగడిక గాంతురీయవనిమెంత (పెద్ద
హీనులైనను వ్యవహారకుశలు భూ.

సీ. సాహసౌదార్య పౌరుషశాలియాతఁడు పావనవంశసంభవుఁ
డతండు, నిఖిలవిద్యాభ్యాస నిపుణుఁడాతఁడు మహాదానక
ళాధురంధరుఁడతండు, అంచిత చతురుపాయజ్ఞుఁ డాతఁడు
బుద్ధికుశలుఁడాతఁడు పూజ్యగుణుఁడతండు, సదమలకీర్తివి
స్తారుఁడాతఁడు భవ్యసరస సౌందర్యలక్షణుఁడతండు
మెఁ ప్రసిద్ధాత్రిఁ బదిపల్లెలేలుచుండు

నతఁడునర్వజనోత్తముండనఁగఁబరగు భూ.

సీ. కుక్షింభరుని బుధరక్షావరుండంచు నతినికృష్టునిమహాత్యా
గియనుచు, బహుబీజసంభవుఁ బరమపావనుఁడంచుఁ జంచ
లాత్ముని ధైర్యశాలియంచు, దౌర్జన్యకారిని ధార్మికోత్త
ముడంచుఁ గఠినచిత్తుని దయాకరుఁడటంచు, జారకర్ముని ప
రదారవర్జితుడంచు, నుత్తమాధముని శాస్త్రవేత్తయంచుఁ
గవులుకర్కారిచేతను గడుపుకొఱకు
సన్నుతింతురుమదిలో విచారపడక భూ.

సీ. పండితశ్రేణికిఁ బ్రబలమాత్సర్యంబు ఘనకవీంద్రులకుయా
చనగుణంబు, భాగ్యవంతులకు వైభవమదోద్రేకంబు స
త్కులోద్భవులకు జారవృత్తి, ధరణీసురులకు సత్కర్మాన
పేక్షిత విద్యాధికులకు దుర్వినయగరిమ, నరనాథులకు నీచ
పురుషసాంగత్యంబు తాపసోత్తములకు, దామసంబు
నలువగల్పించెనేని తన్మహిమఁబొగడఁ
దరమెవ్వారికైన యద్ధాత్రియందు భూ.

సీ. కలిపురుషప్రీతికాంతులైదగుమోట పశులగాపరులు భూపా
లురైరి, చెడుగుకొంటెలకెల్ల బోడమినగడుతోత్తుకొడుకు
లుద్ధతులైరి గురుతుదనర, జారచోరులు దురాచారులన్యా
యప్రిచారులు ప్రబలులై గేరుచుండిరి, మాలలుతమ్ముబ్లి
మంగళ్లనంబులు బలువెజ్జులైరిభూతలమునందు
నౌరయాయుగధర్మంబు లరయమదికి
విస్మయకరంబులై గనుపించుచుండె భూ.

సీ. పంచపురుషుఁడియున్న పనులు పెక్కొనరించి పలుమరుపరువ
భావలువచించి, పూటపూటకు మాంసపుంజముల్ కబళిం

చితనవైభవమున మస్తకవహించి, పలుకొంటెలను ముద్దల
జేసిమన్నించి బుధసంగతి కసహ్యబుద్ధిగాంచి, అన్యాయ
మున విత్తమార్జనఁగాపించి పెల్లుగాఁదిండిచేయొళ్లఁబెంచి
యించుకింతయు సద్వృత్తి యెఱుఁగనట్టి
హీనునకుఁబౌరుషముగద్దె యెంచిచూడ భూ.

సీ. అంగడంగడ చిచ్చుమడిగివేసి ల్ వేసి బాబులుదెచ్చి పైజా
ర్లుబట్టి, బిజార్లుదుడిచి సవారీలుమోసి గుర్రాలమేపియు
గుడిరాళ్లుదగ్రివ్వి, పాగచుట్టంబిల్చి గంపుచానలయిళ్ల
కావలియుండి ఘెుటుకసెప్పి, పశువులగాసి తెప్పలుదీసి ముం
డలదార్చి లంజెలకుఁబాదంబులొత్తి
పాట్లఁబడిమీఁద దొరయైన దుధర్మ
నీతిమార్గంబు నడువగానేరగలఁడె భూ.

సీ. పరిజలసందఱబాధ పరుచుఁ కైబుట్టి యాచకాళుల దిట్టియ
వలగొట్టి, సరసమహాశ్ర పీశ్వరులకెగ్గులుగొట్టి కొంటెల
నలుగురఁగూడగట్టి, పూర్వపరిచితులఁ భూమిలోనికిఁనెట్టి
పంటితోత్తముల రాకుండఁబట్టి, బీదలమనవిదెల్పిన మా
ర్గముఁజెట్టి పరిబలనంపత్తి గర్వమునఁదొట్టి
నట్టికూరిరన్నపాలుఁడు గట్టిదనము
దిట్టముగభవ్యకీర్తిచే పట్టఁగలఁడె భూ.

సీ. పలుగుగయ్యాళి దెబ్బలగండుపలుగాడి మాలుగఁబోతు
బిల్మాయలెడి, పిశినిగొట్టుపిన పెంకెబొంకులపుట్టచెడు
గు నిక్కులయిక్క చెనఁటిపెంకు, టకుబాజుకల్లరి టాటో
టుగడుమోట బండెలపుట్టిల్లుయుందగత్తె, రంతులరాట్టంబు
రవ్వలమారి తంటాకోరు రంతులరావుముచ్చు

యిట్టి శ్రీమంపు పెండ్లాము నేలుచున్న
నరుని దౌర్భాగ్యదశ యెన్న యొరులవశమె భూ.

సీ. దానధర్మవిహీనమానసురాలు సకలమాయావాదజన్మురాలు, గుణతరానేకదుర్గుణగణాన్వితురాలు బహుజనోపద్రవసహితురాలు, భూతభేతాళపరిభూతభీకరురాలు సతతాన్యనిందావిచారురాలు, భూరికోపవికారభావదాహురాలు పరజనద్రవ్యాపహారణురాలు
యెన్నటువంటి పెండ్లాము నేలుచున్న
పురుషుని యభాగ్యమెంతని బొగడవచ్చు భూ.

సీ. కులుకుమిటారి పూవింటుచేతికటారి బంగరుబొమ్మ కప్రంపుదిమ్మ, యన్నులతలమిన్న చిన్నినంపెగగున్న గోములనడుదీవి గుజ్జుమావి, వన్నెలదొంతి మవ్వంపుపువ్వుల బంతి రతవాలతేట నరాలమూట, పండువెన్నెలసోరు బటుమానికపుతీరు వలపులమొక్క మేల్తలుపుచుక్క
యనగ నగియున్న చెలిగూడియలరుచున్న
పురుషునియదృష్ట మెంతనిబొగడవచ్చు భూ.

సీ. గమగమవాంచు చక్కనిమల్లెపూచెండు తమ్మిపాల్గొమ్మ చేతిమ్మపండు, నిగనిగలాడు బల్సొగను కల్వనరంబు రంగారు బంగారు రంగురంబు, చకచకలీను మానికెపుతీరు సలాకనీటొప్పు పవ్వపన్నీటివాక, మిలమిలమెఱయు క్రొమ్మించుమించులతీరు తలతెలల్ళూపు ముత్యాలకోవ
యెన్నయిటువంటి తే యన్నుమిన్నదొరకు
మున్నునిన్నునుతుల్ గొన్నయన్నరునకు భూ.

సీ. చిరతరసౌభాగ్యగరిమ పార్వతినోలి వరభోగములశచీత

రుణిబోలి, బహుతరోత్కృష్ట సంపదనిందిరనుబోలి చతురత మంజూక్తి భారతినిబోలి, రూపవిభ్రమ కళాగూఢినిరతిబోలి సంతతక్షమను భూకాంతబోలి, భూరిపాతివ్రత్యమున న రుంధతింబోలి ఖ్యాతిసంతానాప్తి నదితింబోలి
చెలంగుచున్నట్టి యిల్లాలుగలిగెనేని
పురుషమణి పుణ్యమెంతని పొగడవచ్చు భూ.

సీ. సుదతులముఱి పెంపు సొలపుపాటలకును ననబోండ్లచిన్నారి నగవులకును, మగువలగడితంపు సొగసుచెవులకును యువిదలగడువింత యొప్పులకును, చిలుకలకొలుకుల చిన్నెవన్నెలకును నతివలదద్ద యొయ్యారములకు, మెలతలనీటారు మేలుకోపులకును చెలియలబలితంపు చెలువములకు
బలునిరాబారి పెద్దలేవలసితొల్లి
జిక్కురనివించు యొరులకుఁజెప్పనేల భూ.

సీ. భామలచెలువంపు మోముందమ్ములకును నబలలేజెక్కుటద్దములకు, కాంతలసిబ్బెంపుఁగిబ్బిగుబ్బలకును నంగనామణుల నూగారులకును, కలకంఠకంఠుల కమ్మవాతెఱలకు సుందరాంగుల వాలుఁజూపులకును, పల్లవపాణుల మెల్లనిడలకు మందయానలముద్దు మాటలకును
గాంచిపులకించి ధృతిసంచలించకుండ
నిలువఁగాశక్యమౌనె యానలువకైన భూ.

సీ. ఒకమారువానంత పికవధూకాకలీధ్వనిసద్రుకఠంత నాదములమించి, యొకమారునిర్మల పరికట శరత్పందిచంద్రికా రుచిరహాసములనెరపి, యొకమారునిశితదర్పక ఘను జ్యోతిముకి శోజాలనిభకటాక్షములనించి, యొకమారురత్న

కందుకచారు కుచలనత్కాంతు లొక్కించుక గానుపించి
తరుణు లెంతటి ధీరుల ధైర్యమెల్ల
జారగొందురు కన్నెత్తి జూచిరేని భూ.

సీ. ఒకమారు కెమ్మోవి యొరపు రాణింపంగ నూటిమీటుఁగ చిన్నిపాటపాడి, యొకమారుఁ గుబ్బల యుబ్బు ననడలిన పయిటమెల్లనె పొందుపడఁగ దిద్ది, యొకమారు గడితంబు టొయ్యారములు దోపఁగిలకిల నానుచు నవ్వులనుఁజొక్కి, యొకమారు తేనియ లుట్టిపడ్డటువలె కిలిబిలి ముద్దు పల్కులచేఁ
చెలియ లీకట్టి పురుషుల జిత్తములను (నర్చి
గరుగ జేతురు భృత్యులు గాఁగ తమకు భూ.

సీ. అన్నదమ్ములు కర్మనని మొత్తుకొందురు అక్కచెల్లెండ్రు హాయనుచునుందురు, చుట్టాలు పదుగురు మూఁకఁగాఁజూతు రుతల్లిలోలోపల ద్రుళ్ళుచుండు, జ్ఞాతివారలు చాల చప్పట్లు గొట్టుదురు వదినెగారలు దెప్పి గనుచుందురు, యిరుగుపొరుగులవారు యుండ్లకు రానీరు పెండ్లిండ్ల కైనను బిలువరౌ
కట్టిహాకీదాంగ తనవెంత పెద్ద తప్పు (వరు
మించఁగా నాఁడు దానికి యేది లేదు భూ.

సీ. తలక్రిందుగాను వేదముఁ జెప్పఁగావచ్చు బహుమంత్రసిద్ధులఁ బడయవచ్చు, సకలశాస్త్రములు వచింపంగావచ్చు తీర్థయాత్రలకుఁ దిరుఁగవచ్చు, నతతోపవాన నిష్ఠఁ బూనింపగావచ్చు సర్వపురాణముల్ చదువవచ్చు, నృత్తగీతాదులన్నియు నేరఁగావచ్చు నఖిలగారుడవిద్య లాడవచ్చు
గాని దారిద్ర్యబాధ యొక్కటి యుఁగడువ
శక్తిఁ గలుఁగదు యేలాటి జనునికైన భూ.

సీ. క్షితినాథుచేత తాజీవ మొందఁగవచ్చు బుధులచే మన్నన
బొందవచ్చు, జనులలో బహు యోగ్యుఁడను పించుకొనవ
చ్చు బుధులలోపలఁ గొప్పఁ బొందవచ్చు, జ్ఞాతులచే మహా
స్థానముఁ జెందఁగవచ్చు కులములోఁ బెద్దయై మెలఁగవచ్చుఁ
బరులచేఁ బాదముల్ పట్టించుకొనవచ్చు వీరులలో ఖ్యాతి వె
నవనిలోపల యెట్టివాఁడైనగాని లయవచ్చు
యంచితంబుగ పదికాసుఁ బ్బియున్న భూ.

సీ. ఉదయాస్తమయముల నొగిసిద్రినవాని బలువరకొం
డెముల్ బలుకువాని, సతతంబు పరుషభాషలు వచించెడి
వాని యన్యాయవర్తనుండైనవాని, బహుగుణాస్వేచ్ఛయైన
భార్యఁ గూడనివాని మతిరదాసీ క్రీడసలుపువాని, కొఱగా
నిసంకరకులుల గూడెడివాని కాగిరూళ్లకు వడిగట్టువాని
క్షితిని యిటువంటి జనుని లక్ష్మి కటాక్ష
మూనదరయఁగ యించుకంతైనగాని భూ.

సీ. తనుఁదాను నతిఁ జేసుకొనెఁడువాఁడొక మూర్ఖు వలదన్నప
ని సేయువాఁడు మూర్ఖు, పలుగు పెద్దామఁ జేపట్టువాఁడొ
క మూర్ఖు చాడిచెప్పఁగఁ బూనువాఁడు మూర్ఖు, తనకన్నఘ
నుఁడు లేడనెఁడు వాఁడొక మూర్ఖు వసితఁ జన్ను పిచ్చువాఁ
డు మూర్ఖు, కొఱగానివారల గూఁడువాఁడొక మూర్ఖు వ
లుగాకివలె పేలువాఁడు మూర్ఖు
దనరితనవాండ్రు జేసిన తప్పుపనికి
మోదమలరెడు వాఁడొక మూర్ఖు సుమ్ము భూ.

ర్గమోదోగికిఁ బూర్ణాయువదిసున్న కుటిలచిత్తునకు స
స్తిసున్న, పాపచిత్తునకుఁ బరమార్థమదిసున్న కూ

తుర్మనకు సాధుగుణమునున్న, సజ్జనద్వేషి కీశ్వరసహాయ
మునున్న జ్ఞానహీనునకు మోక్షంబునున్న, ధర్మహీనునకు
నుత్తమలోకగతినున్న కామాంధునకు బుణ్యకర్మనున్న
బహుదురాచారుడై బరగుమన్న
జననకీర్ధరమా కటాక్షంబునున్న భూ.

సీ. వచ్చినయపకీర్తి చచ్చినపోవదు తీర్చిపుచ్చగ నప్పతీర
దేవుడు, చేసినకర్మంబు చెల్లదుకుడువక చావుదప్పదు
యెంతజపిసియున్న, దేహాంతమునగాని తెలియవుదనపా
ట్లుజననిందకంటెనుచావుమంచి, దైవంబుతన్నుమాత్రిమె
బ్రోచుచుండదు పనుగుదుమాట తప్పదుధరిత్రి
యెంతబలువైనదొర నాశ్రయించియున్న
గలుగనేరదు భాగ్యహీనులకుమేలు భూ.

సీ. తనవారులాత్రివారని భేదమరయకదు దివిరియాపదల నొం
దించుటకును, శతుత్రిమిత్రులయందు సమమైనబుద్ధిగాక్షిం
చుచుభంగించిజెరుపుటకును, ఉపకారినపకారి నొకరీతిగా
జూచి గావించునెంతటి ఘూరమైన, గురువునుదైవ మేకో
భావమనుకొని దొడరిచేయును యెంతదోహిమైన
అనుమరీతి జనులుతన్నాడుకొనగ
బ్రితుకుమనుజుండు జీవచ్ఛవంబుగాడె భూ.

సీ. పెద్దలెవ్వరుపేర బిలిచిమాటాడరు భార్యయెప్పుడు తూల
బలుకుచుండు, బంధువుల్ నలుగురు పాటిసేయంగబోరు
నవారలంత భీతినుచునుందుర్తి, పరమార్థసాధ నోపా
కర్మమడంగు నిల్లునొళ్ళునుగూడ గుల్లయగును, అం
దినవార లందఱుతేలికబట్టి బల్ గగ్గులు గొట్టుచుం

తవనిలోపల జారత్వమరయహాని
యెంచిచూచిన బురుషునికేది లేదు భూ.

[illegible]. పితృమాతృలను మతిఃప్రీతిగా మెలఁగుచు గురువులపై భక్తిఁగుదురఁగొలిపి పెద్దలగనిచాల ప్రేమపూజింపుచు దీనులఁబోషించి తెలివెఱింగి, బంధువిధేయుఁడై బహుజనమిత్రుఁడై సాధుసజ్జనగోష్ఠి సలుపుచుండి, పరకాంతలను మాతృభావంబుఁగాఁజూచి సంతతధర్మప్రవర్తనుఁడగుచు

మెలఁగుచున్నట్టి వాఁడెపోదలప భవద
ఖండ కారుణ్యమునఁ బాత్రుఁ డింపుసుమ్ము
భూరిమహిమ హాస కోలంకపురనివాస
మదనగోపాల రాధికాహృదయలోల.



—ఆంధ్రభాషావిలాసిని—

——:o:——

ఇదియొక తెలుఁగు మాసపత్రిక,

పత్రికాధిపతి, కావ్యనిధి,

శ్రీ చలికాని లచ్చారావుగారు

ఇందు సుప్రసిద్ధకవులు రచించిన పద్యకావ్యములు, కావ్యములు, నాటకములు, శతకములు, పూర్వకవుల చరిత్రగ్రంథములగు పురాణప్రభృతులు ప్రకటింపఁబడుచుండును.

సంవత్సరమునకు చందా 2—0—0 లు మాత్రమే.

———

వలయువారు, కార్యదర్శి,

ఆంధ్రభాషావిలాసినీ కార్యస్థానము

పిఠాపురంపో॥